# విషయసూచిక

—:0:—



## "కావలెను"

రావిపల్లి, 8-11-1951

శ్రీకాకుళముజిల్లా పార్వతీపురంతా గరుగుబిల్లి సెంటరులోచేరియున్న యీక్రింద వ్రాయబడిన మూడుగ్రామములకు పాఠశాలలలో పనిచేయుటకు యీదిగువ నుదహరించిన ప్రకారము టీచర్లుకావలెను. సదరు టీచర్లకు ప్రభుత్వమువారి నిర్ణయస్కేలు ప్రకారము జీతములు యివ్వబడును. ఆయాఉపాధ్యాయుల అప్లికేషనులు మాకున్ను, మ. రా. పార్వతీపురంరేంజీ S.D.I. గారికిన్ని 5-12-51 తేదీలోగా పంపుకోవలెను.

| పోష్టు | గ్రామము పేరు | స్కూలు పేరు | మానేజరు పేరు | కావలసిన హయ్యరుగ్రేడు ట్రయిండు టీచర్లు |
|---|---|---|---|---|
| వీరఘట్టాంపోష్టు | (1) రావిపల్లి | ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూల్ | పక్కి అప్పారావు | 2 |
| do | (2) కొత్తపల్లి | do | రావిపల్లి మాధవరావు | 1 |
| గరుగుబిల్లిపోష్టు | (3) పెద్దూరు | do | అరసాడకూర్మ జగన్నాయకులు | 2 |
| | | | | 4 మొత్తము |

ఎ. అప్పారావు పంతులు.

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

విద్యావిషయిక మాసపత్రిక

| సంపుటము 40 | ఏలూరు, 15 నవంబరు | సంచిక 8 |
|---|---|---|





**వివరణము :**

ప్రకృతి మన కెన్నియో మహత్తరవిషయముల బోధించును. కాని వానిని గ్రహించుటకు తగిన అంతరంగజ్ఞాన మావశ్యకమై యున్నది. ఒక్కొక్కదాని పైమూతను దెఱచినకొలది నూతనవిషయములు బోధపడుచుండును. ఇదియే దానిలోని రహస్యము. అది లభించినపుడు మనుజుడు తనవెనుక నొకగొప్ప ఆధ్యాత్మిక సంప్రదాయము, ఒక గొప్ప దివ్యశక్తి యున్నదని గ్రహించును. ఈ దివ్యజ్ఞానమును మనము స్వయం కృషిచేతనే పొందవలయును గాని మఱొకరు తెచ్చిపెట్టలేరు.

**సంకీర్తనము :**

ఓ హృదయాంతర్వర్తీ! నాచిత్త మీ యైహిక విషయములనుండి మరలి స్వచ్ఛమైన నీ స్వరూపము ప్రతిబింబించుటకు యోగ్యమగు నట్లనుగ్రహింపుము. ఈ యజ్ఞానమను ఘోరాంధకారమును నివారించి నా స్వస్వరూపమును గ్రహించు విజ్ఞానము నిమ్ము.

**స్వామి రామతీర్థ.**

# కన్నకడుపులో కత్తిపోటు

(గతసంచిక తరువాయి)

[రాత్రి సుమారు 11 గంటలు కావచ్చింది]

అది ఒక పూరికొంప. ఎప్పుడూ యేవో కొన్ని శనిగ్రహాలతో చుట్టుముట్టి పాక్కిపోతూయుంటుంది పాపం మధుతల్లికి మూడురోజులనుండి జబ్బుచేసి మూసినకన్ను తెరువకుండా పడియుంది ఆమెకు ఉపచర్యచేస్తూ నిరుత్సాహమావరించి కూర్చున్నాడు వెంకన్న గాలికి రెపరెపలాడుతున్న ఆ దీపపు వెలుగులోనే యెక్కడకూర్చున్న పిల్లలక్కడే నిద్రాదేవిఒడిలో వాలిపోయారు చదువుతూ చదువుతూ పాయిబెడ్డపై తలవాల్చి అలా నేనిదురించాడు మధు వారి జీవితదశను పరికిస్తూ కన్నీటిబిందువులను రాల్చుతున్నాడు వెంకన్న

మధుకు స్కూలుజీతం చెల్లించేగడువు సమీపించింది. "నాన్నా! గడువుదాటిందా రూపాయికి ఒక్కణా జరిమానా చెల్లించాలి జరిమానా గడువు కూడా గడచిందా లిస్టునుండి పేరు తొలగించబడుతుంది, పేరు తొలగించబడిందా హాజరుదినములు తక్కువవుతాయి అప్పుడు నేనెంతకష్టపడి చదివినా కృతార్థుడనవడం అసంభవం .." అని యెప్పుడో కుమారుడు తనకు చెప్పినమాట లతని హృదయంలో ప్రతిధ్వనించాయి "ఇప్పుడేంచేయాలి? అప్పిచ్చే వారు కనిపించలేదు అయినా ఇదివరకు తెచ్చినబాకీ తీర్చకపోతే మరల అప్పెవరిస్తారు? యేముఖంపెట్టుకుని వెళ్ళి యెవరినడుగను? ఒకవేళ ఇచ్చినా తీర్చేదెలా .?" అని అనేకవిధాలగ ఆ కష్టజీవి ఆలోచించి, మనస్సునొకదారికి నిలిపి, ఆ అర్ధరాత్రి యెవరికీ తెలియకుండ యెక్కడికో వెళ్ళిపోయాడు

ఒక గంటకాలం గడచింది నిదురిస్తున్న మధుకు యేదో జనుల కలకలం చెవినితాకింది త్రుళ్లిపడిలేచి 'యేంటూ?' అని వీధిలోనికి పరుగువెట్టాడు 'దొంగ, దొంగ' అన్న కేకలువేస్తున్నారు వీధివెంట పరుగు వెట్టుతున్న మధుని జూచి యెవరో ఓ వ్యక్తి బండి చాటున దాగున్నట్లు అలికిడితగిలిందాచీకట్లో. గిఱ్ఱున తిరిగి బండిచాటున దాగున్నవానిని గట్టిగా పడవేసి పట్టుకున్నాడు ఇద్దరూ ముఖముఖాలు చూచుకుని నిర్ఘాంతపోయారు పట్టువిడిచి,—

"నాన్నా!! నీవా? యెంతవమానం!!"

"నేనేనాయనా! యిది అర్ధరాత్రి ప్రమాద స్థితి!" అని వణకిపోతూ చెప్పాడు.

"నాన్నా! మాటనాకిచ్చి నీవిటు పారిపో నేనే దొంగనై పట్టుపడుతాను ఊఁ! త్వరగా!!" అని మాటనంగుకుని బండివద్ద దొంగలా నిలుచుండిపోయాడు మధు.

ఇంతలో అంతావచ్చి అతన్ని చుట్టుముట్టి పట్టుకున్నారు.

ఎన్నడూ యెరుగనిపనిచేసి తప్పించుకోలేక ప్రాణాన్ని అరచేతపట్టి పారిపోతున్న వెంకన్నను వీడే 'దొంగ' అని అటునుండివచ్చే మరికొందరతన్ని చుట్టుముట్టారు పాపం ప్రాణానికితెగించి పారిపో ప్రయత్నించాడు ఇంతలో ఓయువకుని వాడియైన కత్తి అతని ఉదరమును దూసుకుపోయింది 'మధూ' అని కేకవెట్టి, గ్రుచ్చుకున్న కత్తినిలాగివైచి, నేల మీగకొరిగిందా వృద్ధప్రాణి.

కన్నతండ్రికేక విని 'నాన్నా! అని పెద్దపెట్టున అఱచి వారందరిని వదలించుకొని, పితరుని పిలుపు కొరకు పరువెట్టాడు తనకుమారునికి తన కడసారి మాట యేమో చెప్పకయే యీ లోకాన్ని వీడిపోయాడు వెంకన్న కన్నకడుపులో కత్తిపోటును చూడగానే "నీ పితరునకి ఋణపడిపోయావు. నీ వింకా ఎవరికొరకు జీవిస్తావు?" అని అతని హృదయం గంటకొట్టినట్లు ప్రతిధ్వనించింది వెంటనే యెవరికీ దొరుకకుండా వీధివెంట పారిపోమొదలెట్టాడు అతన్ని పట్టుకోడానికి నలుమూలలా పోలీసులు క్రమ్ముకున్నారు కాని యెవరికి అందకుండా పరువెట్టి కనిపిస్తే చంపుతారనికాబోలు దాపున ఉన్న సముద్రగర్భంలో దాగుండిపోయాడు మధు

ఇంతలో ప్రళయకాలపుహోరుకుమల్లే సముద్రతరంగములు బొబ్బరిల్ల మొదలెట్టాయి, గాలి బయ్, బయ్ మని ప్రపంచంమీదికి వీవజొచ్చింది ఫెళఫెళమని ఉరిమే ఉఱుములతో, తళతళమని మెఱసే

# భరతమాత

రుద్రాభట్ల వేంకటభాస్కరరావు, చాపర

భారతమాతా భాగ్యప్రదాయిని
వందనమిదె గైకోవమ్మా!
మమ్మందర దయతో గనుమమ్మా!

1. గంగాకృష్ణ సింధునదులతో । ఘన గోదావరి కావేరులతో
మింటినంటు నటువంటి గిరులతో । బంగరుపంటల ఫలించు తల్లీ ॥భారత॥
2. రాజులకూ కవిరాజులకు । యోగులకు మహాత్యాగులకున్
దేశభక్తులకు మహాశక్తులకు । నిలయమవై ఖ్యాతిని గాంచితివె ॥భారత॥
3. సత్యగుణంబున హరిశ్చంద్రుని । పితృభక్తి నల గాంగేయుని
త్యాగులలో నాశిబిరాజేంద్రుని । మించుశక్తి ముకీయవె తల్లీ! ॥భారత॥

# కృష్ణ స్తవము

ఆ. వె. శ్రీయదుకులభూష లీలావతార స । ద్భక్తజనసమాజ పారిజాత,
మురళిగానలోల పురుషార్థదుండ వీవె? । భక్తిగొల్తు విశ్వ పాల కృష్ణ.
ఆ. వె. పటిమను వసుదేవ పట్టివై గంస చా । ణూరులఁ దెగటార్చుఁ వీరుఁడైన;
సుందరాంగ దాస మందారుఁడవు నీవె? । భక్తిగొల్తు విశ్వ పాల కృష్ణ.
ఆ. వె. శమము, దమము, సత్య శౌచ్యముల్ గలచోట।జన్నములుఁ దపంబుజరుగుచోట
నీతి గల్గుచోట నిల్చియుందువు నీవె? । భక్తిగొల్తు విశ్వ పాల కృష్ణ.
ఆ. వె. సిరులు గుల్కుచుండు శ్రీవత్స మన నీవె? గళమున వనమాల గలిగి తీవె?
జగతి నేలు శంఖ చక్రాయుధుఁడ వీవె? । భక్తిగొల్తు విశ్వ పాల కృష్ణ.
ఆ. వె. అఘములన్నిఁ బాపు మానంద మొనగూర్చు।వరదయార్ద్రహృదయపరమపురుష;
సూరకవిని నేలు సుజనలోకావన భక్తిగొల్తు విశ్వ పాల కృష్ణ.

శ్రీ. పటు సూర్యనారాయణకవి, బొబ్బిలి.

(౧౭౮ వ పేజీతరువాయి)

మెఱపులతో, ఒక్కగడియకాలములోమన్నుమిన్నే కమయేలాగ తుపాను ప్రారంభమయింది దొంగల్ని పట్టవచ్చినవారంతా తమతమగృహములు చేరుకోవడ మసాధ్యమయింది. చెట్లుచేమలు విరిగి శరవేగంగా వీచేగాలి కెఱటాల కాహుతైపోతున్నాయి పూరింటిలోని పాపలప్రాణాలు గాలివానకు ఉడ్డుకుడిచిపోతున్నాయి జబ్బుతోయున్న తల్లి పెబడి కేకలు వేస్తూయేడుస్తున్నారు. పాపం వారినెవరరక్షిస్తారు?

వెంకన్నశరీరం జడివానకు వీధిలో దొబూచులాడుకొంది. అతని నెవరు ధన్యునిజేస్తారు?

మధు భౌతికదేహం తుపానుతోనిండిన సముద్రతరంగములపై నూయలలూగుతూయుంది. వారి కాలమానములా తూలిపోయిందిపాపం

గతించినవారి కాలచక్రం
ఛేరైపోయిన ఆ శవాలు
జాలిచెందే మీ హృదయం
వ్రాయలేని నా కలం— నమాప్తి. నమస్తే!

# ఉపాధ్యాయ నియోజకవర్గ ఎన్నికలకు పోస్టల్‌బ్యాలెట్ పద్ధతిని రద్దుచెయ్యాలి.

విద్యాసౌధమునకు పునాదులవంటివారైన వేల ప్రాథమికోపాధ్యాయులకు ప్రాతినిధ్యంగాని, చివరకు ఓటింగు హక్కుగాని, లేకుండా తీరని అన్యాయంచేసింది భారత రాజ్యాంగ రచనాసభ కాని సెకండరీ స్కూళ్ళలోని సాటిసోదరులకు కౌన్సిళ్లలోనైనా ఆరు స్థానాలిచ్చినందుకు హర్షించాలి అక్కడ కూడా 1-4-51 తేదీనాటికి మూడేళ్ల సర్వీసువుండాలను నిబంధన పెట్టి, అసంఖ్యాకులైన ఉపాధ్యాయుల ఓటింగుహక్కు హరించడంజరిగింది. మన మద్రాసు ప్రభుత్వం మరొకడుగు ముందేసి, ఉపాధ్యాయుల స్థానాలకు ఉపాధ్యాయేతరులుకూడా నిల్వవచ్చునన్న ముద్రవేసింది అంటే ఎక్కడా స్థానందొరకని తన ఆశ్రితులకు మరిద్దరికి సీట్లు చూపించేందుకే ప్రభుత్వం యీ అవకాశం కల్పించింది విద్యా విధానమంటే ఏమిటో ఉపాధ్యాయులను ఎదుర్కుంటున్న సమస్యలేమిటో, బొత్తిగా తెలియని తెలుసుకోను, యిచ్చగించని, యితరులు ఉపాధ్యాయులకు ప్రాతినిధ్యం వహించవచ్చుననుట గొర్రెలను కాయను తోడేలుబావను నియమించినట్లే కాగలదు యిదిగో పసుపు అదిగో ముసుగు అని ఉపాధ్యాయులకు ప్రాతినిధ్యం యిచ్చినట్లు ఒక చెంపన ప్రకటిస్తూ ఆ స్థానాలకు ఉపాధ్యాయేతరులను లేదా తమ చెప్పుచేతల్లో మెలిగే ఉపాధ్యాయులను, నిలిపేందుకు ప్లానులు వేస్తోంది ప్రభుత్వం యిదేనా ప్రజాస్వామ్యమునకు మన పరిపాలకులు చెప్పేభాష్యం ?

ఇంకా యిది చాలదన్నట్లు ఉపాధ్యాయ పట్టభద్రుల నియోజకవర్గాలకు పోస్టల్ బ్యాలెట్ ద్వారా ఎన్నికలు జరపాలని కేంద్రప్రభుత్వానికి తాము సూచించినట్లు ఆర్థిక మంత్రిగారు అసెంబ్లీ సమావేశంలో వెల్లడిచేశారు రహస్యపు ఓటింగైతే నిజాయితీగల ఉపాధ్యాయులు ఎన్నికై అభివృద్ధి నిరోధకమైన తమ విద్యావిధానాన్ని బట్టబయలు చేస్తారని గ్రహించి జిల్లాబోర్డులు, విద్యాశాఖాధికార్ల ద్వారా ఉపాధ్యాయులచేత బలవంతముగా తమ జోహుకుందార్లకు మార్కుచేయించుకొని, వారిఓట్లను లాక్కొనడానికి ముందుగాపన్నిన ఎత్తేయిది యీ సవాల్ను మనంధైర్యంగా ఎదుర్కోవాలి ఉపాధ్యాయవాణి కౌన్సిల్ హాల్లో ప్రతిధ్వనించాలంటే ఈవచ్చినకొద్దిఅవకాశాన్నయినా జారవిడువకుండా సద్వినియోగం చేసుకోవాలంటే ప్రజల పంతుళ్ల, విద్యార్థుల, ఆదరాభిమానముల చూరగొన్న ఉపాధ్యాయ అభ్యర్థులనే ఎన్నుకోవాలి.

ఇటీవల నెల్లూరులో సమావేశమైన ఆంధ్రరాష్ట్ర ఎలిమెంటరీ టీచర్సు ఫెడరేషన్ కార్యనిర్వాహకవర్గం పోస్టల్ బ్యాలెట్ సూచనను నిశితంగాఖండిస్తూ ఒక తీర్మానంచేసింది అదేమేరకు యిండియన్ యూనియన్ అధ్యక్షుడు, మద్రాసు ముఖ్య మంత్రిగార్లకు పోస్టల్ బ్యాలెట్ పట్ల నిరసన తెల్పుచూ టెలిగ్రాములుపంపాం రహస్యపుఓటింగుఅమలుజరుపమని డిమాండు చేశాం అదేప్రకారం పదులు వందల సంఖ్యలో యిట్టి నిరసన తంతెలను కేంద్ర మద్రాసు ప్రభుత్వాలకుపంపి రహస్యపు ఓటింగుకొరకు నిరంతరాందోళన సాగించవలసినదిగా సెకండరీస్కూళ్ళ టీచర్లను యీ విజ్ఞప్తిద్వారా అర్థిస్తున్నాను.

తమకు ప్రాతినిధ్యంలేక పోయినా, ఓటింగు హక్కు నిరాకరింపబడినా, మనదంతా ఒకేవర్గం కాబట్టి యీ ఆందోళనా కార్యక్రమంలో చేతులు కల్పి ప్రాథమికవిద్య, ప్రాథమికోపాధ్యాయుల అభివృద్ధి కొరకు సక్రమకృషి సల్పగలమని హామీనిచ్చిన ఉపాధ్యాయ అభ్యర్థులను పూర్తిగా బలపరచి వారి విజయానికి తోడ్పడాలని ప్రాథమికోపాధ్యాయులను కోరుచున్నాను

అంతేకాదు సంఖ్యాబలమునుబట్టి ఉపాధ్యాయులకు ఉభయశాసన సభల్లో (అసెంబ్లీ కౌన్సిలు) స్థానాలుకేటా యించాలని, ఎట్టిమినహా యింపులు లేకుండా ఉపాధ్యాయు లందరికీ ఓటింగు హక్కు కలుగ జెయ్యాలని, ప్రభుత్వాన్ని డిమాండు చేయవలసినదిగా విజ్ఞప్తి చేస్తున్నాను

సింగరాయకొండ
ది 10—10—51

సింగరాజు రామకృష్ణయ్య
కార్యదర్శి

# ప్రావిడెంటుఫండు రూల్సు

——:o:——

(1950 సం॥ రంలో గవర్నమెంటు ప్రెస్, సూపరింటెండుగారిచే చెన్నపట్టణములో ఇంగ్లీషులో అచ్చువేయించబడిన టీచర్సు ప్రోవిడెంటు ఫండురూల్సు తెనుగున తర్జుమాచేయబడినవి ప్రతినెల పత్రికలోను కొన్ని పుటలలోని విషయములు మాత్రము యీ దిగువ తెలియపరచబడును

తెనిగించినది — కొండ్రెడ్డి సూర్యప్రకాశం టీచరు మేనేజరు
భారతీ ఎలిమెంటరీస్కూలు కొర్లపాటివారిపాలెం.
అమలాపురం వెస్టురేంజి, తూర్పుగోదావరిజిల్లా)

## పింఛనికి అర్హతలేని సర్వీసులో పనిచేయు ఉపాధ్యాయుల ప్రావిడెంటుఫండుకు సంబంధించిన నిబంధనలు.

(1950 సం॥ మార్చి 31 వ తేదీవరకు సవరించబడినది)

1 ఫండును నడిపేవారు — పెన్షనులేని సర్వీసుచేయు ఉపాధ్యాయులయొక్క లాభముకొఱకు ఒక ప్రోవిడెంటు ఫండుప్రభుత్వము వారివలన నడుపబడును. ఫండుకు సంబంధించిన అన్నిచందాలు పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకులో దాచుకొను సొమ్ములవలె నుంచబడును.

షరా — ఈ స్కీము 1923 సం॥రం ఏప్రిల్ నెల 1 వ తేదిని అమలులోనికివచ్చెను

2 ప్రవేశము — (ఎ) విద్యాశాఖవారివలన అనుమతిపొందిన సహాయ పాఠశాలలలోని యీ క్రింద నుదహరించిన అన్నిరకముల ఉద్యోగస్థులకును ఫండును చెల్లించుకొనుట తప్పని సరిఅయియున్నది

i. ప్రాథమికపాఠశాలలు — పంచాయతీ పాఠశాలలు తప్ప 1920 సం॥ రపు మద్రాసు ఎలిమెంటరీ ఎడ్యుకేషను ఆక్టుక్రింద రికగ్నైజుకాబడిన స్కూళ్లలోని ట్రయినింగుఅగు సర్టిఫికేటును పొందిన అందరు టీచర్లను

ii. మాధ్యమిక, ఉన్నతపాఠశాలలు — మదరాసు ఎడ్యుకేషనల్ రూల్సుప్రకారం రికగ్నైజు కాబడిన విద్యాలయములోని ట్రయినింగు ప్యాసై సర్టిఫికేట్ పొందిన అందరు టీచర్లను

iii ట్రయినింగుస్కూళ్లు — మదరాసు ఎడ్యుకేషనల్ రూల్సుక్రింద అనుమతింపబడిన స్కూళ్లలో పనిచేయునట్టి ట్రయినింగు సర్టిఫికెట్లను పొందిన అందరును

iv స్పెషల్ స్కూళ్లు — మదరాసు. ఎడ్యుకేషనల్ రూల్సుప్రకారం రికగ్నైజు కాబడిన స్కూళ్లలోని ట్రయినింగు సర్టిఫికెట్లుగల అందరుటీచర్లను.

v ఐరోపియనుల పాఠశాలలు — ఐరోపియనుల స్కూళ్లకొరకు ఢిగ్యులేషన్సు కోడ్డుప్రకారం రికగ్నైజు పొందిన స్కూళ్లలోని ట్రయినింగు సర్టిఫికేట్లుగల అందరుటీచర్లను

vi కాలేజీలు. — మెడ్రాస్ విద్యాశాఖా నిబంధనప్రకారం రికగ్నైజు కాబడినట్టిన్ని, రాజధానిలోని యూనివర్సిటీ వారివలన డైరెక్టుగానడపబడక, మేనేజి చేయబడక, ఉన్నట్టిన్ని, కాలేజీలలోని ఉపాధ్యాయవర్గములోని అందరువ్యక్తులున్ను

vii. పైన ఉదహరింపబడిన విద్యాలయములలో 2 గాని అంతకుపైగాగాని స్కూళ్లలో పార్టుటయిము టీచర్లుగా నియమింపబడిన వ్యక్తులును.

viii ఎలిమెంటరీ స్కూళ్లలో తప్పపైన ఉదహరింపబడిన అన్ని విద్యాలయములలో నియమింపబడినట్టిన్ని, చిన్ననౌకర్ల ఎస్టాబ్లిష్‌మెంటుకు చెందనట్టిన్ని, అందరు గుమాస్తాలున్ను, అందరు లైబ్రేరియనులును, అందరు అటెండరులును, యితరులును.

(సశేషము)

వచ్చే నెల పత్రికలో.

# ఉషోదయం

'చిరంజీవి'
ఐ. వి. రామకృష్ణశర్మ.



పాత్రలు

రంగయ్య : సుమారు 45 ఏండ్లు

గోపీ : 20 సం॥లు-రంగయ్య రెండో కుమారుడు

స్థలం : రంగయ్య యిల్లు

కాలం : మధ్యాహ్నం 12 గంటలు

తెర యెత్తేసరికి—

గోపీ ఏదో పుస్తకం చదువుతుంటాడు కుర్చీపై కూర్చుని

ప్రవేశం రంగయ్య కోపంతో పైపంచె విసరికొట్టి-

వెధవచదువులూ వెధవలూను. బొత్తిగా పిదప కాలం వచ్చిపడుతూంది. ఒకనీతి లేదు-ఒకజాతి లేదు-కుండా కుంపటీ అన్నీ ఏకమైపడుస్తున్నాయ్.

గోపీ:-(ఆతురతగా) ఏం నాన్నా! ఏం జరిగింది?

రం:-జరగడమేంవిటి నీ మొహంనా మొహమూను. నిక్షేపంలాంటి మన వంశ గౌరవాన్ని నిప్పుల్లో కలిపేడు. వెధవచదువూ-వీడూనూ-మాష్టరీ చదువు కూడా మాలకూటి చదువైంది. మొదట్లోనే ఈ సంగతి తెలిస్తే వెధవని ఇంటినుంచి కాలివతల పెట్టనిచ్చేవాణ్ణా. మీమామ ఆకామిగాడు చేశాడిదంతా. తెలిసుంటే మోసంచేస్తాడా? అయినా మన వెధవ చూడు. అయిదారు నెలలనుంచీ అక్కడే తగులడుతున్నాడా? ఒక్క మాటయినా ఇల్లా ఏడుస్తుందని చెప్పాడేమో చూశావ్?

గోపీ:-అసలు గొడవేంటి నాన్నా!

రంగ:-మంత్రయిపోయాడోయ్. మన వాడు మంత్రయిపోయాడు. మహా గొప్పగా చెప్పుకుంటున్నార్లే - గేటుగుమ్మంలో కడుగుపెట్టేసరికల్లా పాకీ చీపురూ. వీడూ ప్రత్యక్షం. అయిదారుగుర్ని వెంటేసుకుని ఆవరణంతా అద్దంలా చేసేస్తున్నాడు.

గోపీ:-ఎవరు నాన్నా - ఎవరిమాట?

రం:-ఇంకెవర్రా - నీఅన్న - నాకొడుకూనూ - కులాన్నుద్ధరించ పుట్టాడు - బేసిక్కు స్కూలట! బేసిక్కుస్కూలు. అందరూ ప్రపంచాన్నుద్ధరించే వాళ్ళే. వీళ్ళందరూ-తట్టలూ, చీపుళ్ళూ పుచ్చుకోగానే - ముందుకొచ్చేసింది ప్రపంచం.

గోపీ:-వాళ్ళఅంట్లు వాళ్ళే తోముకోవాలిటగా?

రంగ:-వాళ్ళ అంట్లేంవిటి. వాళ్ళ బడి అంట్లు కూడాను. వాళ్లు తినేకూడు వాళ్ళే వండుకోవాలిట. వంటశాల్లోకెళ్లి చూస్తునకదా, పిలక జుత్తులూ, పిల్లిగెడ్డాలూ, ఒకదానితోఒకటి ముడిపెట్టుకొని ముద్దులాడుకుంటున్నై. అదేంవిటంటే అంతా సమానమేనంటాడొకకుంక వెధవ. ప్లీడరుతో దావావిషయం మాట్లాడి తీరా వచ్చాంగదా; చూడకుండా రావటమెందుకని స్కూల్లోకెళ్ళి చూస్తే తోట్లో తవ్వేవాళ్ళు కొందరూ, దొడ్లో సున్నం వేసే వాళ్ళుకొందరూ, ఉచ్చదొడ్లు ఊడ్చేవాళ్ళు కొందరూను. అన్నింటికంటె ఘోరం ఆ అంధరూ కలసి తినటం. సర్వం జగన్నాథం. ఛీ - ఛీ - ఛీ - ఒక్క క్షణంకూడా ఉండబుద్ధేసిందికాదు - ఇంక చాలు ఈ చదువు ఇంతటితో ఆపి యింటికి దయచెయ్యరా అంటే-ఇంకా రెండురోజుల్లో శలవలిస్తారు-ఇప్పుడ రాను పొమ్మన్నాడు వెధవ. ఇంటికిరానీ చెప్తాను.

గోపీ:-ఇంతకీ వాడు చేసినదాంట్లో తప్పేంవిటి నాన్నా?

రం:-మళ్ళా మొదటికొచ్చేవ్? తప్పేంవిటనడుగుతున్నావా? మనవంశమేమిటి? మన గౌరవమేమిటి? మనకీమాలకూడు చదువేంవిటి? లోకం ఏమనుకుంటుంది? మనకులంలో మనకి మంచినీళ్లుపోసేదిక్కైనా ఉంటుందా-వీడిమూలాన?

గోపీ:-అదేవిటి నాన్నా! నువ్వూ అందరిలాగే అంటున్నావ్? కులంలో మంచినీళ్లుకూడా పుట్టనంత ఘోరపాపం ఏంచేశాడు?

రం:-దొడ్లు తుడవటానికి, పెంట లెత్తటానికి, అంట్లుతోమటానికేనా నాకు కొడుకుగాపుట్టింది? పాకీ వెధవ పాకీవాళ్ళకొంపల్లో పుట్టాల్సినవాడు.

గో:-ఎవళ్ళు ఉపయోగించుకొనేదొడ్లు వాళ్లు ఊడ్చుకోవడంలోను, ఎవళ్ళు వండుకున్న అంట్లు వాళ్ళు తోముకోవటంలోనూ, తప్పేముంది నాన్నా?

రం:-మరి పాకీవాళ్ళంటూ ఎందుకున్నారంటావ్ దొడ్లన్నీ వీళ్లూడిస్తే వాళ్ళు దొరలవుతారా?

గో:-పాకీవాళ్ళంటూ ప్రత్యేకంగా అందుకోసము

సృష్టింపబడలేదుగా – కొందరు దొరలవటంతోటే వాళ్ళ సేవకులు కావలసొచ్చింది.

రం:–అందరూ అందలం ఎక్కితే మోసేవాళ్ళు ఉండాలికదుటోయ్!

గో:–ఏకొందరూ అందలం ఎక్కటానికిమాత్రమే పుట్టలేదు.

రం:–అయితే కుడి–ఎడమా ఉండక్కర్లేదంటావ్?

గో:–కుడీఎడమా అంటూ వేరుచేసుకోటంవల్లే ఒకటి బలంగానూ– ఒకటి బలహీనంగానూ తయారై ఒకదానితోమరొకదానికి పొందులేక, ఇలా ఉండీ ఉండిపోయాయ్– ఈ భేదాలే లేకపోతే మనసంఘం ఎంత పటిష్టంగాఉండేదో నీకు తెలియదా నాన్నా!

రం:–అయితే ఏపనికీప్రత్యేకవర్గమంటూ ఉండక్కర్లేదంటావ్ –

గో:–మొహంమీద అచ్చుగుద్దినట్టు ప్రత్యేకంగా ఒక వృత్తికోసమే కొందర్ని ప్రత్యేకించకూడదంటాను.

రం:–సరిసరిలే. మహా తెలివిగానే సమర్థించబోతున్నావ్ గాని ఈపాకీపన్లకుతోడు ఈ మాలకూడేమిటి? నానాకులాలమధ్యా నాయుడిలా కూర్చున్నాడు. చదివేది అతి పవిత్రమైన ఉపనిషత్సూత్రం చేసేది అపవిత్రమైన భోజనపు సంకరం. ఇదికూడఒక చదువేనటోయ్.

గో:–అదే పెద్దచదువునాన్నా! అసలు నేర్చుకోవలసిన చదువేఅది. మనలో పాతుకుపోయిన మత కులద్వేషాలు మాడి చావాలంటే మనమంతా కూడా యిలాకలిసి తినగలిగాలి. అప్పుడే మనకీ, మనదేశానికీ, ముక్తి.

రం:–నీకూ అపాడుబుద్దే పుట్టింది? అడ్డమైనవాళ్లతోనూ కలసి అన్నంతినటంతోటే దేశానికే ముక్తొస్తుందేం?. చావుతెలివులూ మీరు చచ్చుదద్దమ్మల్లారా! ఎవరో ఏవో నాలుగు పిచ్చిరాతలురాస్తే అవే వేదమని చిలకపలుకులు పలుకుతారు. ముందు వెనుక చూడటం మంచీ చెడ్డా ఆలోచించటం ఉంటేనా? నాలుగుమాటలు మాట్లాడ్డంతోటే నాయకులౌతారటోయ్ మీరు?

గో:–నాయకత్వం నాలుగుమాటలు మాట్లాడటంలోలేదు నాన్నా–నాలుగువిషయాలు గుర్తించి అచరించటంలోవుంది. అంతరాత్మల్లో ఎన్ని విద్వేషాలు–విభేదాలూఉన్నా అన్నందగ్గర కొచ్చేసరికి న్నీఅసమసిపోతాయి. అలాసమసిపోవటం అందరూ ఏకం కావటం. అదేకదు నాన్నా – మనసంఘానికిప్పుడు కావలసింది.

రం:–ఈకబుర్లన్నీ నాయకులమని చెప్పుకొని, నలుగురిలో బల్లలుగుద్దే పెద్దలకేగాని, బ్రతుకలేక ఏదో దేవురించుకొనే బడిపంతులుకెందుకోయ్.

గో:–బడిపంతులంటే బ్రతుకుకోసం దేవురించేవాడని అనుకోవడంచేతనే మన భారతదేశానికీగతి పట్టిందినాన్నా! భారత రాజ్యాంగ రథచోదకులైన భావిపౌరుల్ని తయారుచేసేవాడు మనబడి పంతులే. భరతదేశం తన ప్రాచీనగౌరవాన్ని పునరుద్ధరించుకొని భాగ్యభోగాలతో విరాజిల్లాలంటే బాధ్యత గుర్తెరిగిన పౌరులు తయారుకావాలి. పౌరులుబాధ్యత గుర్తెరిగినవాళ్లవాలి అంటే బడిపంతుళ్లు తమ బాధ్యత గుర్తెరిగినవాళ్లవాలి. బాధ్యత గుర్తించగలిగే పంతుళ్లను తయారు చేస్తున్నవే ప్రస్తుతం నువ్వు చూచినలాంటి మనప్రభుత్వ నవీనవిద్యా పాఠశాలలు.

రం:–చాలించవోయ్. నీఉపన్యాసం నువ్వూ వూరూ. పాకీచీపుళ్లు పట్టుకొని బడి ఆవరణను తుడిచెయ్యగానే భారతదేశాన్ని బాగుచేసేవాళ్లు తయారైపోతారేం? పెద్ద నాయకునిలా చెపొచ్చావ్.

గో:–పనికట్టుకొని బళ్లోకెళ్లి పాకీపని చెయ్యటం మాత్రమే చూచొచ్చావ్ నాన్నా నువ్వు. పైపై విషయాల్ని మాత్రమే పరిశీలించి పాఠశాలపద్ధతుల్నే నువ్వు తప్పర్థంచేసుకుంటున్నావ్.

రం:–అక్కడజరిగే ఆలోపలివిషయాలేవో నువ్వు తెలియజెయ్యవోయ్ విని సంతోషిస్తాను.

గో:–శాంతంగా వింటానంటే సర్వం తెలియజేస్తాను.

రం:–చెప్పు చెప్పు. శాంతం కాక కోపమేముందిలే.

గో:–నీకు తెలుసుకదు నాన్నా. నేటి మనదేశపరిస్థితులన్నీ ఒకప్పుడు సకలకళాశోభితమై సర్వసంపదలతో విలసిల్లుతూ, సభ్యదేశాలకి తలమానికమై వెలుగుచూపిన మనభరతదేశం నేడు ప్రతి చిన్న విషయానికీ ఇతరులదయకోసం ఎదురుచూస్తూ, దుర్భర నికృష్ట జీవనం సాగించాలసొస్తున్నది. తినడానికి తిండీ, కట్టడానికి బట్టా, ఉండడానికి యిల్లూలేక 'అతోలక్ష్మణా' అంటూ అల్లాడే అనాధులకొటపట్టగొంది. స్వర్గతుల్యాలైన మన గ్రామసీమలన్నీ నేడు నరకతుల్యాలుగా తయారయాయ్. ఒకనాడు కళాకారుల్ని తయారుచేసిన మన కళాశాలలు ఈనాడు

ఉద్యోగాలకోసం ప్రాకులాడే పట్టణపు పురుగుల్ని తయారుచేస్తున్నాయ్.

రం:-అయితే యింతకీ నువ్వనేదేమిటి ?

గో:-అనటానికేముంది ? స్వావలంబన స్వయం పోషణాసూత్రాల్ని గుర్తింపక పరాన్నభుక్కుగా బ్రతకటం పరిపాటయింది ప్రతివ్యక్తికీ. ఈపరిస్థితులన్నీ తప్పుతేనేగాని ఈదేశానికి నలుగురిలోనూ తలెత్తుక తిరిగే యోగ్యత కలుగదు.

రం:-ఆయోగ్యత కలగటానికి మనవాడు నేర్చుకుంటున్నదే మార్గమంటావా ?

గో:-రాజకీయంగా లభించిన స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోవాలంటే ఆర్థికంగాను, సాంఘికంగాను, స్వాతంత్ర్యాన్ని సంపాదించాలి. అయిన దానికే కానిదానికీ, అన్యదేశాలమీద ఆధారపడకుండా దేశీయపరిశ్రమల్ని ప్రోత్సహించి కొనసాగిస్తే ఆర్థిక స్వాతంత్ర్యం లభిస్తుంది. ఒకప్పుడు మహోన్నతస్థితి నందుకొని కాలప్రభావముచే నీరసించిపోయిన మన కుటీరపరిశ్రమల్ని పునరుద్ధరించాలి. మనకొక్కవాల్సిన తిండీ - బట్టా - మనమే చేకూర్చుకోగలగాలి. సంఘంలోని వర్గాలన్ని సమైక్యతతో మెలంగి సాంఘిక స్వాతంత్ర్యాన్ని స్థాపించుకోవాలి. అంతర్విభేదాలన్నీ అంతరించాలి.

రం:-మనవాడిచదువుకీ నువ్వుచెప్పేదానికీ సంబంధం ఏమిటోయ్. బదరీబాదరాయణం.

గో:-ఆఁ అదే చెప్పబోతున్నా. ఇప్పుడు నువ్వు పాఠశాలలోచూచిన ప్రతీవిషయాన్ని నేను చెప్పిన విషయాల్ని దృష్టిలోనుంచుకొని మరొక్కసారి జ్ఞాపకానికి తెచ్చుకో - అప్పుడు నీకేఅర్థమవుతుంది. అక్కడ శిక్షణనీయబడే ప్రతిచిన్నవిషయానికీ ఎంతటి అమూల్యమైన ఉద్దేశం బలంగా వెనుకనుందో -

రం:-ఇంతకీ నువ్వనబొయ్యేది - ఆపాకీపనీచెయ్యటం పరిశుభ్రతగా జీవించటానికీ, పనిలోని గౌరవం గుర్తెరగటానికీ - అన్నిజాతులవారూ కలసి తినడం అన్నికులాల సమానతను అభ్యాసంద్వారా అర్థం చేసుకోడాని కన్నిన్నీ చెప్పదలచుకొన్నట్లున్నావ్ అంతేనా ?

గో:-కొంచెం యించుమించుగా అంతేనాన్నా. అక్కడ జరుపబడే యితరకార్యక్రమంకూడా యింతటి సదుద్దేశాలమీదే ఆధారపడి నిర్వహింపబడుతున్నాయ్ - సంఘప్రార్థన అన్యమతసహనానికీ - పతాకవందనం జాతీయభావం వృద్ధిచేయ్యబడడానికీ, జరుపబడుతున్నాయ్. అచ్చటి విద్యాబోధన ఒక ప్రధానవృత్తి నాధారంచేసుకొని, పెనవేసుకొని, సాగింపబడుతుంది. నేడుదేశంలో పెనుభూతంలా విహరిస్తూ పీడిస్తున్న వస్త్రసమస్యను ఎదుర్కొనడానికి నూలు పరిశ్రమలో శిక్షణ నీయబడుతుంది. సంఘసేవ గ్రామసేవ-శిక్షణకార్యక్రమంలో ప్రధాన పాత్ర వహిస్తున్నాయ్. సక్రమపౌరునిగా నాతని బాధ్యతను గుర్తెరిగి ప్రవర్తించగలిగేటందుకు సంఘ పరిపాలనావకాశాలు కల్పింపబడ్డాయ్. ఇంకా—

రం:-ఆఁ ఆఁ ఇంకఆపు. ఏవోచెబుతున్నావ్. ఇవన్నీ సత్ఫలితా లిప్పట్లోయిస్తా యంటావా?

గో:-ఇప్పట్లో కాకపోయినా యింకా కొంత కాలానికైనా నాదేశంలో వీటిఫలితాలు కనిపించక తప్పవు. ఇప్పుడే నవీనవిద్యాపాఠశాలలో శిక్షణ పొందుతున్న విద్యార్థులే యీ విషయాన్ని ధృవపరచాల్సినవాళ్లు.

రం:-సరే చూద్దాంలే. నీతో వాదనెందుకు ? ఈకాలపు కుర్రాళ్లతో మాట్లాడడం కష్టం. ప్రతీ విషయంమీద ఉద్రేకపూరితమైన ఉపన్యాసాలివ్వటంలో సిద్ధహస్తులు. ఎల్లుండి మనవాడు వస్తాడుగా, ఎలాంటి పౌరుడిగా తయారయేడో చూద్దాం.

గో:-సరే. చూస్తావ్ గా. ఇంకబట్టలు మార్చుకో నాన్నా - ఇంట్లోకి ఒచ్చినప్పణ్ణుంచి యిలాగేఉండిపోయ్యావ్.

(రంగయ్య లోనికిపోతాడు గోపీతిరిగిపుస్తకం చదువుతుంటాడు. తెరవ్రాలుతుంది.)



యథార్థకథానిక :

# తప్పెవరిది?

రచన : P. V. S. శాస్త్రి
నవ్యోపాధ్యాయపరిషత్, పాచిపెంట

ఏదోపనిపై నేనీమధ్య విశాఖపట్నం తాలూకా "చినముషిడివాడ" గ్రామం వెళ్ళాను. వందకొంపలులేని పల్లెటూరైనా పదహారుగురుపిల్లలతో బడిపంతులు ఒక అరుగుమీద పాఠమును బోధించుట నా కాశ్చర్యం కలిగించింది. Name board చూడగనే జిల్లాబోర్డు పాఠశాలగతికూడా యింతేనా? అనుకున్నా. మూడుకాళ్ళకుర్చీ బొక్కిదో బోడిదో ఒకబిగ్ బెన్ గడియారం ముఖ్యమైన ఉపకరణం నల్లబల్లయుగలవు.

పనిచేయుకాలము ముగిసిందికాబోలు పిల్లలను విడచిపెట్టాడు ఉపాధ్యాయుడు. ఒకకుఱ్ఱవాడు మూడుకాళ్ళకుర్చీని మాష్టరుగారింటికి గాబోలు తీసికొనిపోతున్నాడు. "ఉపాధ్యాయసోదరా! ఈ గ్రామానికి బోర్డువారు కట్టించిన పాఠశాలలేదా? నీవీ అరుగుమీద చదువు చెప్పటానికికారణం?" అని నేను ప్రశ్నించాను. "సోదరా! ఈ గ్రామంలో బోర్డువారు పాఠశాల కట్టుట లేదు. క్రొత్తగా పెట్టిన బోర్డుపాఠశాలలు గ్రామస్థులే కట్టించాలన్నారు బోర్డువారు. ఈగ్రామం నేనువచ్చి సంవత్సరమయింది. గ్రామస్థులు బడియిల్లు కట్టుట లేదు. నేను యెన్నోసార్లు రచ్చబండవద్ద గంభీరోపన్యాసాలిచ్చాను. కనీసపక్షం పశువుల పాకలాంటిదైనా ఒకయిల్లు కట్టిస్తే విద్యాభ్యాసం చక్కగా కొనసాగుతుంది. స్కూలు మూసివేస్తే మరల యీగ్రామానికి స్కూలురావటం కష్టం. ఇంత చిన్న గ్రామంలో ఎవ్వరూ ఎయిడెడ్ పాఠశాలను పెట్టరు. అని యెన్నోసార్లు చెప్పాను. కాని వారి సమక్షమున నాపలుకులు బధిర శంఖారవములయాయి.

"సోదరా! నాకీగ్రామంలో రూపాయి అప్పుపుట్టదు. చల్లనీళ్ళయినా గురుభక్తితో యివ్వరు. నాభార్యాబిడ్డలను పోషించటం కష్టంగావుంది. నిరశనవ్రతాలు సల్పుతున్నాను. నాదీపంబెట్టి పురాణం చదివితే గ్రామస్థులు వింటారు. మూడురోజులలో విద్యాలయం కట్టించుతామంటారు. "తెల్లవారితే అమ్మకిల్లుకడదామనుకున్న జంగాల కథ – మావిద్యాలయంకథ ఒకటే! సోదరా! జిల్లాబోర్డువారు నాయందు దయదలంచిరి. స్కూలుయెత్తివేయవలసిందని**One month Notice** పంపించారు. ఈగ్రామస్థుల గుణగణాలను గ్రామదేవతకు తెల్పినట్లు మూడు పద్యాలు రాశా"నని చదివాడు. నాకు ఒక్కపద్యం జ్ఞాపకంఉంది. అదేవ్రాస్తున్నా.

కం॥ జనులా ? కనికరహృదయులు
వినయవిధేయతలు గలవు-విద్యాలయమున్
ధనమొసగికట్టెంచరు
జననీ ! చినముషిడివాడ - జానపదాంబా !

పేద బడిపంతుళ్ళ కలాలపై కవితాకుమారి నృత్యం చేస్తుంది. ఎందుకో? ఏలనో? నేనుకూడా గ్రామస్థులయెదుట చిన్నలెక్చరిచ్చాను. గ్రామసౌభాగ్యానికి పాఠశాల ముఖ్యమన్నాను. సోదరునివద్దసెలవుతీసికొని స్వగ్రామం చేరాను.

# స్వతంత్ర భారతావనిలో

## ఎయిడెడ్ ప్రాథమికోపాధ్యాయుని స్థితి

స్వతంత్ర భారతావని అవతరించకపూర్వం ఉపాధ్యాయుని జీవితం రు 12 లు మాత్రమే యుండెడిది. మనము స్వతంత్రులమైన తరువాత ఉపాధ్యా ఉపాధ్యాయుని స్థితిలో కొంతవరకు మార్పు వచ్చినది. పూర్వము రు12లు పొందే యుపాధ్యాయుడుఇప్పుడు రు 27 లు పొందుచున్నాడు. ఏదో కొంచెంయింక్రిమెంట్సుకూడా ఏర్పరచియున్నారు. మేనేజర్లకు పాఠశాల నిర్వహణ నిమిత్తమై ఉపాధ్యాయుని జీవితములోనుంచే కోతపెట్టియిచ్చియుండిరి. నేడు అదికూడా రద్దుచేసి ప్రభుత్వమే పాఠశాల నిర్వహణ నిమిత్తమై మేనేజర్లకు ప్రత్యేకపు గ్రాంట్లు యిచ్చుచున్నది. ఉపాధ్యాయవృత్తి అనంతరము ఏదో కొంచెం జీవనభృతికొరకు ప్రావిడెంటు ఫండును కూడా ఏర్పరచియున్నారు. సెలవారీగ్రాంట్లుయిచ్చు పద్ధతికూడా ఏర్పరచి యున్నారు. యింతవరకు ప్రభుత్వమును అభినందించవలసినదే.

ఇప్పుడు ఉపాధ్యాయునిస్థితి ఏవిధముగా నున్నది చాలీ చాలని గంజీ త్రాగుతూ, ప్రజాసేవ చేయుచున్నాడు. కోట్లకు, కోట్లు ధనమును వెచ్చించి జమీలను రద్దుపరచిన ప్రభుత్వము మేనేజిమెంట్లను రద్దుపరచకుండుట కడుశోచనీయము. మేనేజిమెంట్లను రద్దుచేయక పోవుటసరిగదా, పైపెచ్చు మేనేజర్లను ప్రతి ఉపాధ్యాయునకు అదనముగా రు 3 లు యివ్వవలెనని, లేకున్నచో రికగ్నిషను తొలగించెదమనీ హుకుంజారీ చేసియున్నది.

ఇక మేనేజర్ల స్థితికొంచెం ఆలోచించుతాము. వారి ఉదరపోషణార్థమై పాఠశాలలను పెట్టుకొని, రికగ్నిషను సంపాదించుకొని కాలము గడుపుకొనుచున్నారు. అటువంటి మేనేజరు ఏవిధముగా రు 3 లు యిచ్చుకొనగలడు ? వారుయివ్వలేరని మనమందరము ఒప్పుకొనవలసినదే. అదేవిషయమును మేనేజర్లు కూడ ఒప్పుకొని ప్రభుత్వమునకు తెలియపరచినచో బాగుండెడిది. వారు చెప్పరు. డబ్బును యివ్వరు. వారియొక్క పాఠశాలపోవునసే భయము.అందుకనివారు రు 3 లు యిచ్చుచున్నట్లు సంతకములు పెట్టించుకొనుచున్నారు. ఉపాధ్యాయులు సంతకములుపెట్టక ఏమిచేయుదురు ? వారి ఉద్యోగముపోవునసే భయముతో సంతకములు చేయుచున్నారు. భయపడి సంతకములు చేయుచున్న ఉపాధ్యాయునకు మేనేజరునకు, పరస్పర విరుద్ధభావములు ఏర్పడును. అందువలన పాఠశాలబాగుపడుటకు అవకాశమే లేదు. మేనేజరు యివ్వవలసిన రు 3 లు వారిజీతము,

(౧౮౧ వ పేజీ తరువాయి)

మూడుమాసాలు దొరలినవి–

ఉత్తరం రాశాడు సోదరుడు. "సోదరా! నేను చినముషిడివాడలోనే యున్నాను. బోర్డువారు పాఠశాలను మూసివేయడం లేదు. గ్రామస్థులు విద్యాలయం నిర్మించనూ లేదు– నేనూ, నావిద్యార్థులు, పంచలపాలై తిరుగుతున్నాం. గ్రామస్థులు ఆదరించని గ్రామంలో ఎలా బతకటం ? నీవూ ఉపాధ్యాయుడవుగాన, నానిరశనవ్రతముల సంగతి నీకు వ్రాయనక్కరలేదు – ఇక సెలవు" ఉత్తరం చదివి ఒక్కవేడినిట్టూర్పు విడిచాను – జర్నలిష్టుజాతీయుడను గాన సోదరునియందు సానుభూతిని చూపేందుకు యీ యథార్థకథ పత్రికకు పంపించాను.

ఇంతకీ బోర్డువారిదా? గ్రామప్రజలదా? బడిపంతులుదా ? విద్యార్థులదా ? తప్పెవరిదో పాఠకులే విమర్శించెదరుగాక !

పూర్తిగా ఉపాధ్యాయునకు ముట్ట వలయునన్న హెడ్మాష్టర్లను, ప్రభుత్వమే నియమించి, జీతములు వారిద్వారా ఉపాధ్యాయులకు ముట్టునట్లుచేయ వలయును. పాఠశాల నిర్వహణ నిమిత్తమై యిచ్చు గ్రాంటునుంచి ప్రతిఉపాధ్యాయునకు రు 3 లు చొ॥న॥ తగ్గించి మిగతాసొమ్మును మేనేజరునకు యిచ్చినఉపాధ్యాయులకుపూర్తిజీతముముట్టునుగాని మరేవిధమునను ముట్టదు. నేటిప్రభుత్వము ఉపాధ్యాయులకు కొన్నిసదుపాయములు కలుగచేసినప్పటికి ఆర్థికముగాచాలాహీనస్థితిలోనున్నాడనిచెప్పక తప్పదు.

## ఉపాధ్యాయ, మేనేజర్ల సంఘములు చేయవలసిన ప్రని

తమ, తమ, సంఘములద్వారా ఈ దిగువ వాటిని ఏకగ్రీవముగా తీర్మానించుచూ, ప్రభుత్వమునకు మహజర్ల ద్వారాను, డిప్యుటేషన్ల ద్వారాను, తెలియపరచగలందులకు కోరుచున్నాను.

1. జీతమును గాని, కరువుబత్తెమునుగాని హెచ్చించ వలయును.
2. మేనేజర్లు ప్రతి ఉపాధ్యాయునకు అదనముగా యివ్వవలసిన రు 3 లు ప్రభుత్వమే భరించ వలయును.
3. నెలసరిగ్రాంట్లు ప్రతినెలా 10 వ తారీఖులోపున అందునట్లు చేయించవలయును.
4. 2 నెలల జీతము ప్రభుత్వము వద్దనే నిలవఉంటున్నది. అట్లుగాక ప్రతినెలా జీతము మరుసటి నెలలో యివ్వవలయును.
5. పాఠశాల నిర్వహణనిమిత్తమై యిచ్చుగ్రాంట్లలో ఏవిధమైన కోతలు లేకుండా 20% లు నకు హెచ్చించ వలయును.
6. ప్రావిడెంటు ఫండు ఉపాధ్యాయుడు ఎంతకట్టుచున్నాడో అంతా ప్రభుత్వముకూడా యివ్వ వలయును.

అన్నితాలూకా యూనియన్లవారు ఆచరణలో పెట్టగలందులకు కోరుచున్నాను.

ఎ. రామమూర్తి,
సెక్రటరీ.

---

# లక్ష్మీస్తవము

శ్రీదనర్చి మేలుఁ జేకూర్చి నన్నోబ్రోవు । మదమరాళగమన మద్గృహంబు ;
చేరి సంతతము వసించి యుండుము నీవు ? । అంబుజాక్షి వందనంబు లక్ష్మి.
ఎన్ని యున్ననేమి యిజ్జగంబున నీక । టాక్షదీప్తి లేని పక్షమందు ;
ఘనతరాదుఁ గాన గడఁకంటఁ జూడవే ? । చెలఁగి వందనంబుఁ జేతు లక్ష్మి
మంత్రమూర్తి వౌట మా చేయునేరముల్ । నిమిషమం దదల్చి నీరు జేసి ;
వరము లొసఁగి సతము కరుణించి రక్షించు । వినతు లే నొనర్తు విజయలక్ష్మి.
అమితమైనదయను ఆయురారోగ్యముల్ । సిరియు సంపదల విశేషవృద్ధి
గలుగఁ జేయునట్టి కల్పవల్లివి నీవె ? । దీనపోషణి జగదేకలక్ష్మి
నీదు భక్తు లాత్మ నేది గోరిన నది । కొసరకయె యొసంగు కువలయాక్షి !
సూగకవిని బోచు సుగమహీజము నీవె ! । వందనం బొనర్తు పాహిలక్ష్మి,

శ్రీ. పట్. సూర్యనారాయణకవి, బొబ్బిలి.

# బేసిక్ ట్రెయినింగు పరీక్షలు

దివాకర్ల సాంబమూర్తి
సీనియరు బేసిక్ గ్రేడు - ఉంగుటూరు..

బానిసత్వమును రూపుమాపి స్వయం పోషకులుగా జీవయాత్ర గడుపుకొనుట కవకాశములు కల్పింప నుద్దేశముతో నేగదా భారత భాగ్యవిధాత బాపూజీ ఏనాడో ఆసించిన ఆశయము నేటికి సిద్ధించి సర్వతోముఖముగా బేసిక్ విద్యావిధాన రూపమున విలసిల్లుచున్నది. బాపూజీ ఏ ఉద్దేశముతో ఈ విద్యావిధానమును సూచించెనో ఆ ఉద్దేశము పూర్తిగా నెరవేతె దేశము ఆర్థికముగాను, వైజ్ఞానికముగను, నైతికముగను అభివృద్ధి నొందవలెనన్న ప్రస్తుతము బేసిక్ శిక్షణపొందు ఉపాధ్యాయ విద్యార్థుల బాధ్యత ఎంతేనిగలదు. వీరే అనేకమంది భావి పౌరులను తయారు చేయవలసియున్నది: స్వయంపోషకత్వమే మూలాశయముగా గల్గిన బేసిక్ విద్యను వీరే ఇంకను సర్వతోముఖముగా వ్యాప్తినొందించవలసియున్నది·

అట్టి ఈ ఉపాధ్యాయ విద్యార్థులు ఈ విద్యావిధానములో తర్బీదుపొంది ప్రభుత్వ పరీక్షలలో (Public Examinations) ఉత్తీర్ణులై ఈ మెట్టును దాటవలసియున్నది. అందులకై జట్టులవారీగా (Batches) బేసిక్ శిక్షణను పొందిన జిల్లా విద్యాశాఖాధికార్లు (District Educational officers) తదితర గవర్నమెంటు పాఠశాలోపాధ్యాయులు, ఉపాధ్యాయ విద్యార్థులకు పూర్తిగా చేయూత నొసగవలసి యున్నది.

1. బేసిక్ విద్యావిధానములో గ్రంథావశ్యకత మిక్కుటముగా లేకపోయినను, ప్రభుత్వపరీక్షలలో నివ్వబడు ప్రశ్నపత్రములకు సరియైన జవాబులను వ్రాయగలిగియుండుటకు గ్రంథపరిచయముకూడ కొంత అవసరమై యున్నది. ఇందులకై బేసిక్ శిక్షణను పొందిన జిల్లా విద్యాశాఖాధికార్లు తదితర ప్రభుత్వ పాఠశాలోపాధ్యాయులు, బేసిక్ ఉపాధ్యాయ విద్యార్థిలోకమునకు వలయు గ్రంథములను వ్రాయుటకు కృషిసల్పి సాధ్యమైనంత త్వరలో అందుబాటులోనికి తెచ్చినచో ఉపాధ్యాయవిద్యార్థులకు గొప్పమేలు జరుగుటయేగాక ఇంకను ఎక్కువమంది పరీక్షలలో ఉత్తీర్ణులగుట కవకాశ మెంతేని గలదు. అదియునుగాక బేసిక్ విద్యావిధానమునకువలయు గ్రంథములు కొన్ని ఆంగ్లభాషలో లభ్యమగుచున్నవి. ఇట్టి గ్రంథములను జూనియరు బేసిక్ గ్రేడు ఉపాధ్యాయ విద్యార్థులకుకూడ బాగుగ అవగాహనయగుటకు ఆంధ్రభాషలోనికిమార్చి వ్రాసిన మరింత సహాయకారిగా నుండగలవు.

2. మరొక ఇబ్బంది ఏమనగా ప్రస్తుతం బేసిక్ శిక్షణను పొందుచున్న ఉపాధ్యాయ విద్యార్థులు పాఠశాలలలో ఉపాధ్యాయులచే ప్రాక్టికల్ (Practical) పరీక్ష చేయబడుటయేగాక ప్రభుత్వ పరీక్షలకుకూడ హాజరు కావలసియున్నది. ఈ పరీక్షలో మొదటిసారి ఉత్తీర్ణులైనవారి కెట్టివిధమైన బాధయులేదు. పరీక్షలో తప్పినవారు ఏ సబ్జక్టులో (Subject) తప్పిన తిరిగి ఆ సబ్జక్టును పూర్తిచేసికొనుటగాక తిరిగి అన్ని సబ్జక్టులకు పరీక్షకు హాజరుకావలసియున్నది. ఈ విషయములో జిల్లా విద్యాశాఖాధికార్లు

# అక్టోబరు నెల చిత్ర ప్రశ్నలు

(1951 సం॥ అక్టోబరు నెల సంచికలో ప్రకటింపబడిన)

## వివేక ప్రశ్నలు

అను చిత్ర ప్రశ్నలకు సమాధానములు

### ౧. గోలకొండ. ౨. గోదావరి.

* * *

| చందా నెం. | రెండు ప్రశ్నలకు సరియైన సమాధానములు పంపినవారు. |
|---|---|
| 231 | పి. నైనాచార్యులుగారు - హెడ్మాష్టరు - వైకుంఠలక్ష్మీపురం. |
| 484 | కె. రామన్నగారు - రిటైర్డుటీచరు - కోడుమూరు. |
| 368 | అల్లంరాజు సూర్యారావుగారు - హెడ్మాష్టరు - శృంగవరము |
| 455 | అల్లంరాజు బంగారంగారు - టీచరు - కొంతంగి |
| 264 | కౌశిన ఆదినారాయణరావు - విద్యార్థి - గరులియా, పశ్చిమబెంగాల్ |
| 270 | భోగాపురపు సీతారామస్వామిగారు - హెడ్మాష్టరు - కొట్టిశ |
| 427 | సి.హెచ్. వెంకటకృష్ణయ్యగారు - హెడ్మాష్టరు - వోల్వేరు |
| 134 | కవల వీరభద్రుడుగారు - టీచరు - గుడివాడ |
| 14 | శేగడి సత్యనారాయణగారు - మేనేజరు - కోటిపాం |
| 374 | యస్. కె. డి. ప్రసాదలింగంగారు - హెడ్మాష్టరు - దుగ్గిరాల |
| 78 | కె. రామంధోరగారు - టీచరు - వేమలి |
| 232 | కొల్లూరు సోమేశ్వరరావుగారు - బిక్కవోలు |
| 161 | బి. రామకృష్ణయ్యగారు - టీచరు - మాతూరు |
| 439 | కణతికొరు నాయుడుగారు - ముద్దపువానిపేట |
| 258 | పి. రామూర్తినాయుడుగారు - టీచరు - లక్ష్మీపురం |
| 213 | పి. నారాయణ నాయుడుగారు - సాలూరు |
| 482 | కొప్పర్తి సుబ్బారావుగారు - టీచరు మేనేజరు - పెసర్లంక |
| 234 | చక్రపాణి రాఘవరావుగారు - హెడ్మాష్టరు - కొత్తకోట |
| 286 | డి. వి. తిరుపతిరావుగారు - టీచరు - ఉద్దవోలు |
| 567 | పేర్ల వెంట్రావుగారు - టీచరు - పాములవలస |
| 283 | మైలపల్లి నారాయణస్వామిగారు - పెదమేడపల్లి |
| 140 | తెన్మఠం సత్యగోపాలాచార్యులు - జి. టి. స్కూలు - అనంతపురం |

---

(౧౨౮ వ పేజీ తరువాయి)

బేసిక్ శిక్షణాలయముప్రధానోపాధ్యాయులు తదితర బేసిక్ ఉపాధ్యాయులు, ఉపాధ్యాయ విద్యార్థుల తరఫున నాన్ బేసిక్ విద్యావిధానములోవలెనే గ్రూపుపద్ధతి(Group System)ని ఏర్పాటుచేయుటకు ప్రభుత్వమువారిని కోరుచూ తీవ్రమైన కృషిసల్పినచో తప్పక ఆశయసిద్ధియగును. విద్యావిషయిక పత్రికా సంపాదకులుకూడ ఈ విషయమునుగూర్చి తమ పత్రికలద్వారా తీవ్రమైన కృషిసల్పి ఆశయసిద్ధియొనర్చెదరని ఆశించుచున్నాను.

111 దుంపరామమూర్తిగారు - టీచరు - చింతపల్లిపేట
274 జి. ముకుందరావుగారు - టీచరు - ఆరకు
402 రేగులవలస సత్యనారాయణగారు - టీచరు మేనేజరు - గార్రాజు చీపురుపల్లి
469 కలిదిండి సత్యనారాయణరాజుగారు - టీచరు - మొయిద
82 కె. చంద్రరాయుడుగారు - టీచరు - కొడవండ్లపల్లె
473 డా. చక్రాల తిరుపతిరాజుగారు - రామచంద్రపురం - గుంటూరుతాలూకా
182 జర్షువరపు సుబ్బారావుగారు - కొమరవోలు
208 జర్షువరపు వెంకటేశ్వరరావుగారు - కొమరవోలు
358 సూరివిజయరామ శేషయ్యగారు - హెడ్మాష్టరు - కొమరవోలు
169 T. N. బూతన్నగారు టీచరు M. రాయపురము
కె. మార్తాండరావుగారు. ఏలూరు

రెండవ ప్రశ్నకు మాత్రమే

150 జోగిమహంతి అప్పలనరసింహులు పట్నాయక్‌గారు - టీచరు మేనేజరు - అన్నపురం
293 వెంకమహంతి అప్పన్నపట్నాయక్‌గారు - టీచరు - బడ్డవానిపేట
300 టి. వి. జె. రామారావుగారు - హెడ్మాష్టరు - ముత్యాలపల్లి
279 కత్తిర నరశింహాప్పడు - టీచరు - కొత్తవలస

# వివేక ప్రశ్నలు

౧. కుతికె నలుపు గాని శితికంఠుడా కాదు
పాముగాదు — నెమలిపక్షిగాదు ;
గంతులిడుచునడచుగాని కప్పయుగాదు
దీనిభావమేమొ తెలుపవలయు.
—శ్రీ జి. ముకుందరావు, టీచరు - ఆరకు.

౨. నాల్గువర్ణాలు మృగముపేరగును; భువిని
ఆది యంత్యముల్ కలిపిన అగునుచెట్టు ;
ఆదివిడువ నమస్కృతియగును చూడ ;
అట్టిమృగనామమును దెల్పుడార్యులార!
శ్రీమతి వి. మాణిక్యమ్మ, టీచరు - ధర్మవరం.




# పంతుళ్లకు అన్యాయం

నూతనరాజ్యాంగం ప్రకారం స్వతంత్ర భారతదేశంలో పెద్దపెట్టున ఎన్నికల సంరంభం ప్రారంభమయింది. మూలనున్న పార్టీలన్నీ ముందుకు వచ్చినై. ఎవరికివారే శంఖాలు పూరిస్తున్నారు. మహోద్ధృతంగా ప్రచారం సాగిస్తున్నారు. బలాబలాలు పరీక్షించుకోటానికి సిద్ధపడుతున్నారు. వర్గప్రాతినిధ్యాలకు స్తోమతులు కల్పిస్తున్నారు.

నూతనరాజ్యాంగం ధర్మాన ఉపాధ్యాయులకూ ప్రత్యేకప్రాతినిధ్యం లభించింది. మన మద్రాసురాష్ట్రం మొత్తముమీద టీచర్లకు ఆఱుస్థానాలు ఇచ్చారు. ఇందుకు మన స్వతంత్రప్రభుత్వాన్ని మనరాజ్యాంగ నిర్మాతలను, ఎంతైనా అభినందించవలసినదే. ఊరూ పేరూ లేక యేమూలనో పడివున్న పంతుళ్ళకు ఈమాత్రం ప్రత్యేకత, గౌరవం పరిపాలనలో భాగం, లభించినదంటే యెంతో సంతోషించాలి. గర్వించాలి కూడా.

అయితే యిచ్చేది యిస్తూ అన్యాయం చేసింది మనప్రభుత్వం. ఓటింగుహక్కులో ఒక పెద్ద అన్యాయం జరిగింది. పంతుళ్ళకు ఎంత సర్వీసువున్నా హయ్యరుగ్రేడువారికి ఓటింగుహక్కు లేనేలేదు. ఇక పోతే సెకండరీగ్రేడువారికి హక్కు కల్పించింది. అయితే ఇందులోకూడా ఒకఅన్యాయం జరిగింది. ది 1-4-1951 తేదీనాటికి మూడేండ్లు సర్వీసు నిండినవారికే ఓటింగుహక్కు. ఈ నిబంధనవల్ల అంతసర్వీసు పూర్తికాని సెకండరీగ్రేడుటీచర్లు ఎందఱో హక్కును కోల్పోయారు. అంతేగాక సెకండరీ స్కూళ్ళలో పనిచేసే సెకండరీగ్రేడు టీచర్లకు మాత్రమే ఓటింగు హక్కు ఇచ్చింది. ప్రభుత్వం దీనితో ఉపాధ్యాయలోకానికి పెద్దదెబ్బ తగిలింది. అంతసర్వీసు వుండి, సమానమైన అర్హతవుండి, ప్రాథమిక పాఠశాలలలో పనిచేస్తున్నంతమాత్రాన సెకండరీగ్రేడు టీచరకుఓటింగుహక్కు లేకపోవుటేమిటి? ఇది చాలా అన్యాయం. అందరికీ సమానహక్కులు కల్పించిన ప్రభుత్వం పంతుళ్ళపట్లయీవిభేదాన్నిచూపటం హర్షించతగ్గదికాదు. ఈవిభేదాన్ని తొలగించి సమానవిద్యార్హతలు గల పంతుళ్ళందరికీ ఓటింగుహక్కు కలిగించాలని మామనవి.

పైనిబంధనలవల్ల ఎంతో వడపోత జరిగింది. ఇందుకే ఉపాధ్యాయలోకం గగ్గోలు పడుతూంటే మనప్రభుత్వం మరోప్రకటన చేసింది. ఉపాధ్యాయవర్గానికి ప్రత్యేకించిన సీట్లకు ఉపాధ్యాయులు కానివారు కూడ నిలబడవచ్చునట! అట్టివారిని ఉపాధ్యాయులు తమప్రతినిధులుగా భావించి ఎన్ను

కోవాలట. ఇది యెటువంటి న్యాయమో బోధపడలేదు. ఉపాధ్యాయేతరునకు ఉపాధ్యాయుల కష్టనిష్ఠురాలు ఏమి తెలుస్తవి? ఆ తెలియని పెద్దమనిషి ఉపాధ్యాయుల కొఱకు ఏమని కృషిచేస్తాడు? అసలెందుకు చేస్తాడు? ఇదిచూస్తే యిచ్చినట్లే యిచ్చి ఈయూరుస్థానాలను కూడ ప్రభుత్వమే ఆక్రమించుకోవాలని అనుకొన్నట్లు తోస్తూంది. కాని ఉపాధ్యాయలోకమంత గ్రుడ్డిగాలేదు. తమవృత్తికి సంబంధించని మరోవ్యక్తిని ఉపాధ్యాయులు కలనైనా ఎన్నుకోరు. కాబట్టి యీవిషయాన్నిగుర్తించి ప్రభుత్వం ఉపాధ్యాయేతరుల కట్టి యవకాశం లేకుండా చేయాలని మనవి. లేకపోతే ఉపాధ్యాయ స్థానాల కుండే ప్రయోజనంపాడైపోతుంది.

ఈ యన్యాయాలన్నీ ఇట్లుండగా అసలు ఓటింగు పద్ధతిలోనే గొప్పఅన్యాయం జరిగింది. ఉపాధ్యాయులు పోస్టల్ బ్యాలెట్ పద్ధతిద్వారా రహస్యంగా ఓటు చెయ్యాలి. ఇందువల్ల నిష్పాక్షికమైన ఎన్నికలు జరగటానికి చాలా ఇబ్బందులు గలుగుతాయి. ప్రభుత్వపరిపాలనలోవున్న పంతుళ్ళుగాని, బోర్డు, మునిసిపాలిటీలు, అధీనములోవున్న పంతుళ్ళుగాని, స్వతంత్రంగా తమ యిష్టప్రకారం ఓటుచేసే హక్కును చాలవఱకు కోల్పోవటానికి అవకాశాలు ఏర్పడుతవి. తమపై అధికారుల వొత్తిడివల్ల ఉద్యోగధర్మాన్నిబట్టి వారి చెప్పుచేతలకు లొంగవలసివస్తుంది. అందువల్ల సక్రమమైన ఎన్నికకుగాని, సరియైన వ్యక్తి ఎన్నుకోబడుటకుగాని, వీలులేకపోవచ్చుకూడా, పార్టీబలాన్నిబట్టి, అధికారుల వొత్తిడిబట్టి, ఏ అనామకుడో పైకిరావచ్చు. ఇదంతాచూస్తే దేవునికి వట్టిచేయి చూపించి పూజారే అంతా ఆరగించినట్లవుతుందని అనుకోవలసివస్తున్నది. కాబట్టి రహస్యపు ఓటింగుపద్ధతిని రద్దుచేసి బహిరంగముగానే ఎన్నికలు జరిపించుట న్యాయమని ప్రభుత్వానికి మా మనవి.

పైన వుదహరించిన యీ అన్యాయాలన్నీ తొలగిపోయినప్పుడే పంతుళ్ళకు నిజమైన ఉపయోగం జరుగుతుంది. లేకపోతే పేరు దేవుడిది. నోరు అర్చకుడిది-అన్నట్లవుతుంది. ప్రభుత్వం మా మనవిని చిత్తగించి, యీ అవరోధాలన్నీ తొలగించగలదనీ, ఉపాధ్యాయలోకానికి సరియైన, న్యాయసమ్మతమైన, ఓటింగు హక్కులను ప్రసాదించగలదనీ, విశ్వసిస్తున్నాము.

—సంపాదకుడు.




15—11—1951 మొ॥ 15—12—1951 వఱకు.

మేషం—కార్యసాధనము - సామంతజన విద్వేషము - దారపీడ- సుతాఽమయము - ఉత్సాహభంగము - దుర్ఘోషము - శత్రుసంవాదము - గమనాఽఽగమనవ్యథ - దుఃఖవార్తాశ్రవణం - ధనలాభవ్యయములు

వృషభం—దాస దాసీభృత్యజనము - లాభము - నిత్యమృష్టాన్నము - ధనధాన్యములు - ఇష్టసిద్ధి - కార్యనష్టము - జ్ఞాతి వ్యాజ్యకలాపకము - బంధుసమాగమము - హీనస్త్రీ భోగసంతాపము.

మిథునం—వస్త్ర - ధన - ధాన్యలాభములు - మనోధైర్యము-విద్యావినోదసౌఖ్యము-మానసికాందోళనం మిత్రసంతోషము - ప్రయాణసూచనలు - భవిష్యల్లాభసూచన - భగవత్పూజాపరాయణత్వము - సాధు సంభాషణము.

కర్కాటకం—అధికధనలాభము - నిత్యస్త్రీభోగసంతోషాతిశయములు - స్వకులాచారములు - గృహలాభము - ఆరోగ్యము - బుద్ధిబలముచే కార్యసిద్ధి - స్వస్థానప్రాప్తి.

సింహం—క్లేశము - వృథావైరము - కార్యనాశము - సంచారము - చోర - నృప-అగ్నులవలనభయము- గాంభీర్యనాశనం నిష్ఠురవచనప్రలాపములు - సాహసం - క్రోధము.

కన్య—అర్థనాశం - జ్ఞాతివైరం - బుద్ధిజాడ్యం - మఱపు-మనస్తాపము - గాంభీర్యం - గౌరవము - గాత్రపోషణం - ఆధ్యాత్మికదర్శనం - అభీష్టకార్యసిద్ధి -

తుల—ధనలాభము - చిత్తసౌఖ్యము - పరస్త్రీగమనం - యత్నకార్యార్థలాభము - స్త్రీసల్లాపము - వస్త్రలాభం.

వృశ్చికం—శత్రుజయం - ధనలాభము - ఉద్యోగము - సదాసంచారము - దుర్బలభోజనం - అధికారిభాషణం

ధనుస్సు—బుద్ధిచాంచల్యము - స్వకర్మగతిహాపణము-విదేశ సంచారము. వ్యాకులం - శోకసంతాపములు- ఉద్యోగవిఘ్నము-

మకరం—శోకము - రోగము - మహాదుఃఖం - ఒకానొకప్పుడు ధనప్రాప్తి - ఒకానొకప్పుడు సుఖము-

కుంభం—మనస్సౌఖ్యము - యశోవృద్ధి - సౌభాగ్యం - ధనాగమము - అపమృత్యుభయం - ధనవ్యయం

మీనం—వ్యాధిపీడాప్రవాసములు - అంతఃక్లేశసహిష్ణుత్వము - మహాభయం - అర్థనష్టము - కార్యహాని - గౌరవము - సత్సంగము - భక్తి - జ్ఞానసిద్ధి - వైరాగ్య ప్రలాపములు - దైవసేవ.

(మీజన్మజాతక కుండలిగ్రహ సంచారములవల్ల గోచార ఫలములు పరిణామము చెందుచుండును.)

☞ సిద్ధయోగినీ - నాడీజ్యోతిష శాస్త్రరీత్యా జాతక-ముహూర్త-వాస్తు - ప్రశ్న - కవచధారణాది విషయములు సరసముగా సాపేక్షికముగా దెలుపబడును. మహామండలిపేర వ్రాసిన సంగతులు విశదీకరింపబడును.

దైవజ్ఞభూషణ, పండిత
డి. యస్. యన్ శాస్త్రి
శ్రీశివనాడీ జ్యోతిర్నిలయం.
పవరుపేట - ఏలూరు పశ్చిమగోదావరి జిల్లా.



# సభలు తీర్మానములు.

వేణమ్మపేట: తే 4-11-51 దీని పితృసంఘసభ జరిగెను. శ్రీ M. భాస్కరరావుగారు సభకు అధ్యక్షత వహించిరి. పాఠశాలవసతి పెంచినందుకు సభ్యులు హర్షమును వెలిబుచ్చిరి. బాలబాలికలను ఎక్కువగా పాఠశాలకు పంపిన వేరొక యుపాధ్యాయునికి జీవనము కల్గుననియు, అందుకొరకు పురజనులు మిక్కిలి తోడ్పడవలసినదిగా అధ్యక్షులు కోరిరి. చి॥ కె. గణపతిరావు జాతీయగీతములతో సభ జయప్రదముగా ముగిసెను.

యం. వేంకట్రావు పట్నాయకు

శ్రీ చీపురుపల్లి రేంజి స్కూళ్ళ జూనియర్ డిప్యూటీ యినస్పెక్టరువారైన C. H. గోపాలకృష్ణారావుగా రధ్యక్షతను బోర్డు ఎలిమెంటరీ స్కూలు బిళ్ళలవల్సను సంబంధించిన తలిదండ్రులసంఘము స్థాపించుటకై తే 27-10-51 దీని గం. 12 లకు తలిదండ్రులసంఘము జరిగినది. సదరు సంఘమునకు యీ క్రింది సభ్యులను ఎన్నుకొనబడిరి. 1. పెనుమత్స పాపయ్యరాజుగారు 2. బుద్ధరాజు వెంకటనరశింహరాజుగారు 3. సాగి సూర్యనారాయణరాజుగారు 4 బెహరా సత్యనారాయణ 5 అంపోలు పరసాయ యీగ్రామములో నిరక్షరరాసులుగా నున్న 44+73 బాలబాలికలను సాధ్యమైనంత త్వరలో ప్రవేశింపచేయుటకు ప్రోత్సహింపబడుచున్న అధ్యక్షునకు అభివందనములతో సమావేశము ముగించబడినది.

బోర్డు ఎలిమెంటరీస్కూలు<br>బిళ్ళలవల్స<br>27—10—51

బెహరా గోపాలము, హెడ్మాష్టరు.<br>సంయుక్త కార్యదర్శి<br>తల్లిదండ్రులసంఘము, బిళ్ళలవల్స.

## విజయవాడ :

పశ్చిమ కృష్ణా, విజయవాడ తాలూకా టీచరు-మేనేజరుల సంఘసమావేశము నేటిసాయంకాలము 2 గంటలకు పున్నమ్మగార్డెన్సు-హిందూయెలిమెంటరీ పాఠశాలయందు శ్రీ కొండూరి మంగేశ్వరరావుగారి అధ్యక్షత క్రింద సమావేశమైనది. సభకు పెక్కండ్రు టీచరు-మేనేజరులు హాజరై యీక్రింది తీర్మానములు యేకగ్రీవముగా ఆమోదించిరి.

తీర్మాన వివరములు

(1) ఎయిడెడ్ యెలిమెంటరీస్కూళ్ళ మేనేజరులు వారివారిపాఠశాలలలో పనిచేయు హాయ్యరు మరియు సెకండరీగ్రేడ్ టీచర్లకు అదనముగా నెల1కి రు 3-0-0ల చొ॥ యివ్వవలసిన అదనపు జీతమునుగురించి ప్రభుత్వముయొక్క తాఖీదులను గురించి ఆలోచించుట.

ఇందునుగురించి శ్రీప్రభుత్వమువారు జారీచేయించినఉత్తర్వు మేనేజర్లలో ఆందోళన గలిగించినందున యీవిషయము న్యాయస్థానముద్వారా రద్దుపరిపించుటకు తీర్మానించడమైనది.

(2) ఆంధ్రరాష్ట్రప్రాప్తికి శ్రీ స్వామిసీతారాంగారు చేసినట్టియు చేయుచున్నట్టియు కృషికి ప్రశంసించుచు శ్రీవారికి సానుభూతిని తెలుపుకొనుట.

యీతీర్మానమును, సభవారు యేకగ్రీవముగా ఆమోదించుచు శ్రీస్వామిసీతారాంగార్కి అందచేయుటకు తీర్మానించడమైనది.

ఇట్లు,

విజయవాడ<br>29-10-1951

E. Sambasiva Rao<br>Secretary 29-10-51

ANDHRA RASTRA PRARAMBHA VIDYA
Regd. M N. 3766 Vol. 40. - No. 8



ది 11-10-1951 వ తేదీని సాయంత్రం 6 గంటలకు గుంటూరుతాలూకా రావెల గ్రామములలోని హిందూఎలిమెంటరీ పాఠశాలా (Rvs) భవనమున శ్రీ గుంటూరునార్తు రేంజినూళ్ళ జూనియర్ డిప్యూటీ యినస్పెక్టరు I. సత్యనారాయణరావుగారి అధ్యక్షతక్రింద షిప్టుసిస్టముప్రకారము విద్యగరపుపద్ధతి అమలు నందుంచువిషయమును గురించి సభజరుపబడెను. సదరుసభకు గ్రామమునందుగల అన్నిప్రాథమిక పాఠశాలల మేనేజర్లు, హెడ్మాష్టరులు, ఉపాధ్యాయులు, గ్రామపెద్దలు, హాజరైరి. శ్రీ అధ్యక్షులవారు పుష్టపద్ధతి వలనకలుగు ప్రయోజనములనుగూర్చి వివరించి చెప్పినమీదట యీ దిగువ తీర్మానములు ఏకగ్రీవముగా ఆమోదించబడెను.

1. శ్రీ విద్యాశాఖవారు రావెలగ్రామములో షిప్టుసిస్టము ప్రకారము విద్యగరపుటకు నిర్ణయము చేసినందులకు యింగుమూలముగా తమ సంతొషమును వెలిబుచ్చుచున్నారు.
2. ఈ గ్రామమునందుగల అయిదు ప్రాథమికపాఠశాలల ప్రధానోపాధ్యాయులు యీ కమిటీయందు మెంబర్లుగా యుండుటకు
3. గ్రామపెద్దలలో యీదిగువవారు యీకమిటీమెంబర్లుగా యుండుటకు
   1 శ్రీ డాక్టరు శిరిపురపు రాధాకృష్ణమూర్తిగారు,
   2 శ్రీ గ్రామ మునసబు మేకల కోటయ్యగారు,
   3 శ్రీ పంచాయతీబోర్డు ప్రెసిడెంటు వలేటి పెదనరసింహయ్యగారు,
   4 శ్రీ గ్రామకరణం, రావెల వెంకటసివసీతారామారావుగారు,
4. ఈ కమిటీ చేయవలసిన పనులు
   (a) యీ సెలాఖరులోగా యీ గ్రామములోబడి యీడుగలిగి, ఏపాఠశాలలోను చేరకుండాయున్నవారి పట్టీలను తయారుచేసి, ఆయా బాలబాలికలను ఆయా పరిసరపాఠశాలలో చేర్పించుట.
   (b) గ్రామమునందు విద్యావిషయముగా ప్రతిమెంబరును ప్రచారముచేసి, వయోజనులుగూడా విద్యనభ్యసించుటకు తగుప్రోత్సాహముచేయుట.

రావెల,
ది 11-10-1951

రావెల వెంకటసుబ్బారావు, సెక్రటరీ
హెడ్మాష్టరు హిందూఎలిమెంటరీ పాఠశాల (R.V.S.)

## అమలాపురం :

ది 14-10-51 తేదీన అమలాపురం తాలూకా టీచరు మేనేజర్లు అండ్ మేనేజర్లు అసోసియేషను వర్కింగుకమిటీ అమలాపురం శ్రీనివాస ఎయిడెడ్ పాఠశాలయందు జరిపిన మీటింగులో ఉపాధ్యాయులకు నెల1కి రు 3-0-0లు చొ॥ ప్రభుత్వమువారే నిచ్చుటకును, 1945లో నిర్భంధ విద్య అమలుపఱచిన ప్రదేశములలోకూడ అద్దెగ్రాంట్లు ఇప్పించుటకును, తీర్మానించుట జరిగినది.

(Sd) ఎ. కేశవరావు, సెక్రటరి.

## ఆకులకట్ట :

ది 23-10-1951 తేదీన బొబ్బిలిసౌత్ రేంజి సీనియరుడెప్యూటీ ఇనస్పెక్టరు శ్రీ టి. నరసింహమూర్తిగారు. బి. ఎ., బి. యిడి., ఇచ్చటికివచ్చి శ్రీ వేణుగోపాల పాఠశాలలో సాయంకాలం 5గం. నుండి బహిరంగసభజరిపిరి. చాలమంది ప్రజలువచ్చిరి. వారందఱికి బడియీడుగల పిల్లలనందఱిని బడికిసక్రమముగా పంపునట్లును, వారివిద్యాభివృద్ధిపట్ల ఎక్కువశ్రద్ధ తీసుకొనుటకున్నూ, విద్యాసంఘము నొకదానిని ఏర్పఱచుకొనుటకున్నూ, నచ్చచెప్పిరి.

(Sd) పి. సన్యాసిరావు-మేనేజరు

Edited by Sri M. Venkata Ratnam Garu, B A., & Printed and Published by Sri E. Venkaiah Garu at his Pattabhirama Press, Eluru.